# అచల వేదాంతాచార్యులు

అనుబంధము

కీ॥ శే॥ అరిగె రామస్వామిగారు

(ఆంధ్రప్రదేశ్ మాజీ మంత్రి వర్యులు)

ప్రచురణ:

**పరిపూర్ణాచల వేదాంత పరిషత్తు, వరంగల్.**

డిసెంబర్ 1974 వెల: 0-50 పైసలు

ఈ గ్రంథ ప్రచురణకు ఆర్థికముగా తోడ్పడిన పాపయ్య పల్లి (ములుగు) వాస్తవ్యులు శ్రీ తూపి వెంకటరమణారెడ్డి, శ్రీమతి పుష్పలత. గార్లకు నా హృదయపూర్వక అభివందనములు.

నల్లి జనార్దన్

---

పరిషత్ సమర్పించు నాలుగవ కానుక.

---

ఈ గ్రంథములు దొరుకుచోటు:

**శ్రీ నల్లి నర్సయ్యగారు**

తామ్ర పత్రి గ్రహీత

**స్వాతంత్ర్య సమరయోధుడు**

శివనగర్—వరంగల్.

## శ్రీశివరామ దీక్షిత పీఠాచార్యులు

1 అచలబోధకు పూర్వాసు ఆనివిమ
దివ్యమైనట్టి సద్గురు దినకరుండు
యాజ్ఞవల్క్యుడు వసుధ అనాది ప్రభుడు
జనక మహాఋషి విఖ్యాతి జైగురుండు.

2 శుకుడు సాందీప కృష్ణులు సూక్ష్మప్రజ్ఞా
లర్జునులు యుద్ధవులు వీరలాది గురులు
అఎల గురుజండ బూనిరి హస్తమందు
యుగ యుగంబుల చాటిరి యగణితముగ.

3 బ్రహ్మానందస్వాములు. పరగరామ
నందులును, జ్ఞానప్రభుడు అమంద హృదయ
సచ్చరిత్రులు సమరులు. సహజనంద,
యవని రామావధూతలు, యంబిక శివుల్.

4 వేమనార్యుడు, పరిపూర్ణ విమలగుణుడు
ధరణి తిరువేంకటాచారి దండి గురుడు,
మతము వారలసుడిలోన మనుజులంత
గొట్టుకొనిపోవ, గాచిన కోవిదులుర.

5 శ్రీధరులు వీరు మహిలోన చీకుచింత
లేవి బోధచే జనులకు లేశమయిన
యెరుకలేదంచు పరిపూర్ణ మెరుకపరిచి
శూన్యమున శూన్యమయ్యె యీ సుగుణకరుడు.

6 అవని నారాయణా పురమందు వెలసి
ద్వైతబోధ తదితరముల్ తరచిచూచి
దీక్షితీయము వ్రాసిరి దివ్యముగను
అతడె శివరాము డమలుడు యచలగురుడు.

7 కంబలూరి పురంబువం గాంతమీర
భక్తజనులకు పరిపూర్ణ భావములను
అతుకనేర్పిన సద్గురు డప్పరావు
దశదిశల బోధ నెగజల్లె ధార్మికుండు.

8 పావనంబైన ఎరగొండ పాలెమందు
నిలిచి భద్రాద్రి రాముడు నిఖిల జనుల
నేలు దొరయని శతకంబు నిచ్చినట్టి
పరశురామ శ్రీనరసింహ పండితుండు

9 పరశు శ్రీసీతారామని పరులచేత
పిలువబడి ప్రీతి తోడుత భీతిలేక
యచలబోధను తత్వముల్జేసి జనుల
ఖ్యాతివంతుల చేసిన ఘన ప్రభుండు.

10 హైదరాబాదు యందునా యవతరించి
దివ్యమగు పూర్ణబోధకు తిలకమద్ది
కంద కందార్థముల ద్వారా కలను మార్చి
ప్రజల మన్నన లందిన భాగవతుడు.

11 సద్గురూ గీతలేగాదు శాస్త్రములను
శోధనలు చేసి బోధకు సొంపుదీర్చి
దిద్ది నాంపెల్లిలో వెల్గు దివ్యముగను
శంకరుడు షీలు ఖాన్సాంశ శశి సముండు.

12 తత్వములు తత్వబోధలు తరచి తరచి
తత్వముగ దీర్చి భక్తుల తత్వమరసి
తత్వరహితుల చేసిన దంటి షీలు
ఖాన లక్ష్మణ ప్రభుడని ఘనులసూక్తి.

13 పరగ చిత్తూరు గ్రామాన ప్రకటమయ్యె
మాతయై ప్రజల భ్రాంతుల తొలగజేసి
సచ్చిదానంద స్వామంచు సాధువులచె
వినుతికెక్కిన పగడాల వేంకటకవి.

14 కాకతీయుల హస్తాన కాకతీరి
యన్ని తీరుల యభివృద్ధినంది ధరలో
సొసగ వెలిగేటి ఓరుగల్ పురమునందు
నేతి శ్రీ వేంకటేశుని నేత యనిరి

15 వేద వేదాంత సూక్తుల విధము నెరిగి
యోరుగల్ పురమునందునా యొజ్జయయ్యె
జగదాసని నుతి కెక్కినట్టి దేశి
కేంద్రు నెరుగని వారలు ఇందుగలరె:

## మాతృశ్రీ తూడి దేవమాంబగారి చరిత్రసంగ్రహం

1 రత్నగర్భ యీ భారత రాజ్యమందు
తేజమై యొప్పు బంగారు తెనుగు సీమ
కాకతీయుల గడ్డ యీ కంచుకోట
దివ్యమైనది భువి దాని తీరమందు

2 జమ్మికుంటలో మా తల్లి జననమందె
ఘనులు పత్రోరి వంశాన గారవాన
లక్ష్మికిని వీరరెడ్డికి లాలితముగ
పర్వతేశుని సతియందు పార్వతట్లు.

3 తండ్రి శివభక్తి తనలోన దైవభక్తి
గలుగజేయగ బాల్యాన కనులుమూసి
స్మరణ చేయును యేమేమొ సాధువట్లు
అబ్బురా యిది యందఱి కబ్బ దహహా.

4 దేవమాంబని పేరడి దేశికులకు
ప్రీతి పాత్రురాలగు నందు ప్రేమతోడ
బ్రాహ్మణోత్తము లవిరి యీ పాపనాంగి
రిత్త బోవునా? వారన్నరీతి యయ్యె

5 దినము దినమట్లు గడువగ దిశలు మెరయ
కాంతి పుంజముల్ విరజిమ్ము కంజనేత్రి
పెండ్లి చేసిరి పెద్దలు ప్రీతితోడ
రమ్యగుణుతూడి రాఘవరమణుతోడ.

6 ఆదిదంపతు లనగ యీ యవనియందు
గడుపుచున్నారు కాలంబు కలిసి మెలిసి
దాన ధర్మాలు భువిలోన తపసులెన్నొ
చేయుచున్నారు సతిపతుల్ చెలిమితోడ.

7 చిన్న తనమందె పొందిరి చిరత నొకతె
అడులే లేవు వారి యానందమునకు
కాని విధి తన వర్తన కఠినమయ్యె
రాఘవుని దేహ మారోగ్య రక్తి తక్కె.

8 అందునకు తల్లి తోచక డెందమందు
నేమి యీవిధి నన్నిట్లు యేచుటేమి ?
యెవరికిని యేమి పాపముల్ ఎరిగి సేయ
నైతినని కుందు మదినందు హతవిధంచు.

9 పటగారాని వ్రతములు పట్టెతల్లి
నోయగారాని నోములు నోచె తల్లి
చిన్న వేల్పుల తాకన్న వేల్పులకును
మొక్కులను మొక్కుమీరె మా దిక్కటంచు

10 పాలకుర్తిన తనపతి బ్రతుకునంచు
మదిని భావించి పయనమై మార్గమందు
అష్టకష్టాలు పడె తల్లి యంతకంత
భర్త ప్రాణాలె తమ సర్వ భాగ్యమంచు.

11 ఇల్లు వాకిలి విడనాడి యెన్నొనాళ్లు
సోమనాథుని సేవించి సోమజలము
దెచ్చి పతికిచ్చు పలుమార్లు తిరిగి తిరిగి
బ్రతుకవలె నంచు పతికయ్యె భ్రమల పడుచు.

12 విన్న మందులు తానిలకన్న మందు
లవనియందున పరువెచ్చె యడవి మందు
లెన్ని పోసిన ఫలితంబు యేమిలేదు
క్షీణదశ కొచ్చె మా తండ్రి క్షితిని తుదకు

13 పుట్టి నటువంటి జీవులు పుడమిలోన
నాసి నొందక యుండునా కన్న తల్లి
భర్త పైనుండు ప్రేమచే బ్రహ్మతత్వ
మెరుగలేదాయె రాఘవుం డెల్లపోయె

14 అంత నా తండ్రి పరలోక మరిగియుండ
సర్వమును చెల్లె నాకంచు సాధ్వి మదిని
భర్త కడకేగ వెనువెంట పయనమాయె
ఎంత వెఱిది మాతల్లి నేమనందు.

15 వేదవేత్తలు సుజ్ఞాన వేద్యులంత
దుఃఖరహితంబు పద్ధతి తొలగజేసి
మరణ యత్నము నుండియు మరలచేసి
శాంతి నొందింప జేసిరి సదయులయ్యె.

16 దైవ మేతీరు చూసెనో ధైర్యముగను
రామగాథల భారత రమ్యకథల
సహజ కవి పోతనార్యుల సత్కృతులను
జదువుచుండును మాతల్లి సమరసమున

17 తండ్రి యింటిలో కొన్నాళ్ళు తనదుయత్త
వారలింటిలో కొన్నాళ్ళు వాసమంది
గడిపె నా తల్లి కొన్నాళ్ళు గడువ తుదకు
జన్మ మృతులన్న వివరంబు చదువనెంచె

18 రామలక్ష్మమ్మ ఆశ్రమం రయముతోడ
జొచ్చి వినుతించె నాగురు చోద్యమంది
దేవమాంబ గుణంబులన్ దెలిసి సర్వ
సుకర్మ ధర్మాలు తెలిపె నీ మహితలాన.

19 ఆరు వత్సరాల్ కడచిన అవల తల్లి
జన్మ రహితంబు పద్ధతి జనని నడిగె
రామలక్ష్మమ్మ యదిగని రదిసేసె
తెలియరానిది తానేమి తెలియజేయు

20 అంత నా తల్లి యటనుండి యరుగుదెంచి
శుకుడు జనకుని జేరిన సుది యట్లు
యాగయార్యుని జేరియు యవనియందు
వలన పరిపూర్ణ జిజ్ఞాస యయ్యె తల్లి.

21 ఆగయార్యుడు ఆగమ నిగమబోధ
లెన్నియో చెప్పి మాతల్లి కున్న భ్రమల
దొలగజేసెను యాగయ్య అచలగురువి
సేవజేయక నరులకు స్థితియు గలదే

22 అట్లు గురుమూర్తి చేతను యచలధర్మ
మెరిగి గురువాజ్ఞ కయిబోధ ధరణియందు
చాటనెంచెను. గురుమూర్తి మాటదప్పి
నిల్చు భక్తుల నందురే నిర్మలులని ?

23 అన్ని విద్యల యందున ఆరితేరి
చివరి వేదాంత విద్యకై పవలురేయి
పరితపించేటి భక్తుడు భవ్యమూర్తి
మల్లికార్జుని కడతేర్చె మహితలాన.

24 మాతృ శ్రీయని వేడిన మాన్యురాలు
యవని పరమేశ్వరాంబను ఆదరించి
జనన మరణంబు భ్రాంతిని చనగచేసి
దీక్షదక్షల నిచ్చిన ధీరమాత.

25 అంతియెగాదు యోరుగల్ యాశ్రిమమ్ము
వచ్చి వినుతించు భక్తుల వాంఛలరసి
ఘోర సంసార బాధల గూలద్రోసి
వెలుగుచున్నారు సద్గురు విమలమాత.

26 మంగళంబగు మాతృశ్రీ మహితవల్లి
కెల్ల మంగళ చరితురై యుల్లమందు
మంగళంబంచు పాడుడో మాన్యులార
ఎరుకమరుపుల పరితాప మెరుగ రెపుడు.

## అంకితం

ఈ పద్యములు వ్రాసి 1972లో మా పరిషత్తు పక్షమున ద్వితీయ పుష్పముగా ప్రకటించు ప్రయత్నములో నేనుండగా శ్రీపిల్లలమర్రి భీమయ్యగారుకొన్నిపాటలు చూపించివానిని సవరించుమని కోరినారు అప్పుడే శ్రీ మేరు నారాయణగారు సినిమా పాటలలో వేదాంతార్థముతోపాటు, దొంగసన్యాసులను ఖండించు భావములను మేలవించిచేసి చూపినారు. భీమదాసు శిష్యులవద్ద చందాలు వసూలుచేసెదనని మాటఇచ్చి కొంత సహకరించి నందున అంతరంద గ్రంథము (ద్వితీయ పుష్పము)ను ఆనాడు అట్లు ప్రకటించగల్గితిమి,

తిరిగి "మాతృశ్రీ" వారి చరిత్రను, వారిఅనంతరము 29-12-74 న పన్నెండేళ్ల "నా" పుట్టిన రోజుసందర్భ మున ఉన్నది ఉన్నట్లుగానే అమరచరితయగు ఆతల్లి దివ్య చరణారవిందములకు అంకితమిస్తున్నాను,

వరంగల్

ఇట్లు
నల్లి ఉపేందర్

# అను బంధము

## దొంగ గురువుల స్వభావ ఖండన

ఆంధ్రప్రదేశ్ శాసన సభ్యులును, చాలా కాలము మంత్రి పర్యులుగను ఉండి, ఒకచేత రాజ్యాంగము మరొకచేత ఆధ్యాత్మిక రంగమునుపట్టి నటించిన దిట్ట, కీ శే అరిగె రామస్వామిగారు. వారువ్రాసికున్న పద్యములను 24-12-58న రాజమండ్రిలోని శ్రీరామేన ఆదినారాయణగారున్ను, శ్రీపొన్నాల రాజయ్య స్వకల్పిత పీఠాధిపత్యమునకు అపజయము అను క్రిమినల్ మరియు సివిల్ కేసుల ముఖ్యతీర్మానములు ప్రచురించుచు దానికి అనుబంధముగా సికింద్రాబాదు "భూమానంద నిజపూర్ణ బోధనిలయము" వారు ప్రకటించినారు,

ఈ పద్యములు మొత్తము అచలవేదాంతములోనే గొప్ప మార్పును తెచ్చినవి,

వరంగల్ విభాగములో ముఖ్యముగా ములుగు ప్రాంతములో ఇటీవల కొందరు అవకాశవాదులు పీఠాధిపతులమని బోధాధికారులమని భ్రష్టాచారాలను ప్రచారము చేస్తున్నారు,

ఈ ప్రాంతములో మాతృశ్రీ తూడి దేవమాంబగారుచాలా కాలముగా అచల వేదాంతమును బోధించుచు ఇటువంటి దుష్టశక్తులను, పిచ్చికుక్కలను అణచివేసినారు. వారు 10-8-74న నిర్యాణము చెందినారు ఇక ఇదే అదనని ఈ అడ్డగాడిదలు

సర్వ సామ్రాజ్యాధిపతులమని, శిష్యులను బెదిరించి ధన,ధాన్య వస్తు, వాహనములను,మగువలను,మధు,మాంసములను తెప్పించుకొని అనుభవించుచు పీర విహారము చేయుచున్నారు.

సామాన్యజనులు ఈపెద్దవల మోసపూరితములైన కృత్యములకుబలి యగుచున్నారు. ఈసందర్భములో పూర్ణానందుని ఈ పద్యములు వారికి సహకరించగలవని, ఈపద్య పఠనము వలన ప్రభావితులయి, నిజమును గ్రహించి,ఈదొంగగురువుల స్వభావములను ఖండించుచు సరిహద్దులు దాటువరకు తన్ని వెడల గొట్టుదురని భావించుచు ఇచట ఈచిరుపొత్తమునకు అనుబంధముగా ప్రచురించుచున్నాము.

ప్రస్తుతమున కుపకరించు 12 పద్యములు మాత్రమే మీముందుంచుచున్నాము.

విజ్ఞులు సమాదరించి, చపటలు, పన్ను విషవలయములో పడక తమ్ముతాము రక్షించు కొందరుగాక—

వరంగల్
20-12-74

నల్లి జనార్దన్
ప్రధాన కార్యదర్శి
పరిపూర్ణాచల వేదాంత పరిషత్తు
శివనగర్ వరంగల్

# 12

## దొంగ గురువుల స్వభావ ఖండన

రచన: శ్రీ అరిగె రామస్వామిగారు

1 గురువులమని పేరిడుకొని, పరసౌతులరించ, పితాత్పతి
పదవులకై, పరువులిడె చండాలుర నరుతెరుగక ఆశ్రయించా
నరకమే కాదె, ఎరిగి చేరాముర్ఖామెకాదె॥ సరులక్షేమమురిటి
పాషాండగురువుల, పురజనోత్తములెల్ల పూనీదూరకిన్న ॥న॥

2 శిష్యుల భ్రమలోముంచుచు। శిష్యురాండ్ర పిచ్చినగూర్చి
సిరులుహరించి। మసిజేతులరవల బోధలో అన్యాయము ఎంత
వరకు యగుపడకుండగా నలుదిశల్వీరియల్ల విరిండగా। మసి
బూసినట్టిముఖరమునకు దీయనియట్లు గుసగుసాపరమ్రాము గొం
దిలో గునిగేరూ ॥య॥

3 మధు,మైథున, మాంసభక్షణ, విధిగా గురుపూజలందు విరి
విగవాడె, పదవిలో పితాత్పతులట సదమల పరిపూర్ణబోధ॥ సద్గు
రులాట, వంచకులెట్లు వరిల్లెదాట, హృదయమలినములకి, పదవి
భ్రాంతులకిక్కె అధములు తామెట్లు అచలగురువుల్లట ॥

4 కరికోరలంటి నీతులు, మదిలో దౌశాండ్లు మిరుగుకర్మికి
నరబికములుండుపంస్థలో పరమా కడతేరమెన్ని తరములకైన
యెరుగుకి దస్యుల,ఎదిరించియైన। అచయగ ఈనిర్గుణానంద
గురువులు స్వగురునైనను విడక గూర్చేరు యిడుమలో ॥ద॥

# శివరామని అభిప్రాయములు

1 "రావణాసురుడు సన్యాసివేషం వేసుకొని సీతను దొంగులక పోయినాడు, మూఢులకు దొరకనిసీత, భ్రాంతిరహితులకు ఏమీలేదు, సీత మూఢరాలుగనుక సన్యాసిఅని భక్తి చేత వూరికే ఉంటె, ఎత్తుక పోయినాడు. సన్యాసి మొద్దులకు మొద్దు, సన్యాసిని నమ్మరాదు"

శ్రీశివరామ దీక్షితీయము: షోడశిభావం, స్వప్నదుష్టాంతము అను గ్రంథములో పేజి నెం. 65

2 "ఇది అద్వైతంపలెలేదు. లేదు అనిఎగబడి చేసే మూర్ఖంకాదు. గుర్తెరిగే జ్ఞానం నేనుఅని, కర్మాలులేనేలేవుఅని, ఎగబడిచేసే రాక్షసకృత్యం కాదు"

విశేషావరణ ద్వయదోషరహిత ప్రకరణం పేజి 69

3 "కులానకు కులమేతెగులు. కులములన్నియు కులద్రోహములే" వర్ణ నిరసన ప్రకరణలో

4 "ధనమునకై గురువులనైన జంపగోరుచు భ్రమలచేత దిరుగు చుందురు"

స్వప్న దృష్టాంత ప్రకరణము.

---

వేమన్న పద్యములలో చెప్పిన విషయములనే, శివరాముడు వచన రచన చేసి చూపినాడు. విజ్ఞుల మూలము నరయ గోరెదము.



# శ్రీ వసంతా ఆయుర్వేద వైద్యశాల, వరంగల్.

## మేహావ్రణ నిపుణులు

మూలవ్యాధి—అరువిధములయిన అరిశమొలలు, ఆసన గండమాల, భగందరము, సుంకి, వ్రణములు, మేహాగ్రంథులు, అడ్డసిరిగడ్డలు, ఇంకా అతిపురాతనమైన దీర్ఘతర వ్యాధులను మాచే శస్త్రరహితముగనో, సులభముగా చికిత్స చేయబడును.

**గమనిక:** స్త్రీలకు స్త్రీలచే చికిత్స చేయబడును.

# Dr. M JANARDHAN R. M. P.

**Railway gate, Warangal.**

---

ధనలక్ష్మి ప్రింటింగ్ ప్రెస్, జె. పి. యన్ రోడ్, వరంగల్.